# పాలేరు

రచన:

బోయి భీమన్న

శ్రీ స్వరాజ్య పబ్లికేషన్సు
విజయవాడ-1.

Krishna

# పాలేరు

(ప్రసిద్ధ సాంఘిక నాటకం)





బోయి భీమన్న



శ్రీ స్వరాజ్య పబ్లికేషన్సు,
విజయవాడ-1.

# పాత్రలు:

| | | వయస్సు |
|---|---|---|
| వెంకన్న : | కథానాయకుడు. చదువు తర్వాత వెంకటేశ్వరరావు అవుతాడు. | 15 |
| కుబేర్రావు : | ధనవంతుడు, కామందు. పూర్తిగా అభివృద్ధి నిరోధక తత్వంగల మనిషి. | 35 |
| సుందరం : | సంస్కార భావాలున్న విద్యార్థి. | 20 |
| ఉపకారి : | పల్లెటూరి బడిపంతులు, సంస్కారి, కుల మత భేదాలు లేకుండా అందరూ చదివి, విజ్ఞానా న్నార్జించాలంటాడు. | 30 |
| వీరేశు : | వెంకన్న పినతండ్రి. అజ్ఞాని. | 34 |
| పుల్లయ్య : | వెంకన్న తండ్రి. కుబేర్రావు పాలేరు. | 43 |
| రామం : | కాకినాడ అనాథ శరణాలయ మేనేజరు కొడుకు | 26 |
| బాల : | సుందరం చెల్లెలు, అన్నగారి సంస్కార భావాలు బాగా వంటపట్టిన దిట్ట. | 12 |
| సీతమ్మ : | వెంకన్న చుట్టం, వీరేశు ప్రేమికురాలు | 18 |

ఇంకా: దొంగరామన్న, బంట్రోతు, కొంతమంది రైతులు.



ఈ నాటకమును ప్రదర్శించువారు దిగువ అడ్రసుకు వ్రాసి పర్మిషను పొందవలయును.

ఇట్లు,

దత్తి అప్పారావు.

మల్లికార్జున పేట,

విజయవాడ-1.



బోయి భీమన్న

# పాలేరు

## మొదటిరంగం

[రైతువాడలో ఒక పొలం. సాయంసమయం. ఒక తాటిచెట్టు మొదట నిలబడి, వెంకన్న దూడల్ని అదలిస్తూ వుంటాడు.]

వెంకన్న: (పాట)

బానిసతనమును-బాపుమురా
భారతభూమికి-భాగ్యము తేరా।
సకలదేశముల-సర్వమానవుల
సామ్యము-సాధింపుమురా।
ఒకడు తినుచు-మరియొకడు పస్తుపడి
యుండుట ధర్మము-కాదురా।
కూడు, గుడ్డ కొంపయు సమానముగ
కూర్చుమురా లోకమున
ప్రభుపు సేవకుడు లేని సంఘమును
పదిలముగా నిర్మింపుమురా।
సౌఖ్యము, సంతోషము, మానవులకు
సమకూర్పుమురా। వీరా।

(కుబేర్రావు దురుసుగా ప్రవేశిస్తాడు.)

కుబే: వెంకా। ఒరేయ్। దున్నపోతా। దూడలు తినెయ్యడం లెదట్రా ఆ నువ్వుచేను।

వెం: (అదిరిపడి) ధ। ధ। ఇలా। ఇలా। నువ్వుచేను దూడలు తిన వండి బాబు! ధ। ధ।

కుబే: నువ్వా తినప్। పరిగెత్తరా ఎడ్డిగాడిదా।

వెం : ధ ! ధ ! చేలో పడలేదండిబాబు ! ధ ! ధ ! గట్టునమేస్తుందండి.

కుబే : మాటలునేర్చిన కుక్క ఉస్కో అంటే, ఉస్కో అందిట ! నువ్వు పాటలుకూడా నేర్పావ్ ! ఆ గట్టంతా మేసేస్తున్నాయ్ పరిగెత్తరా మొద్దుపీనుగా !

వెం : (పరిగెత్తబోయి పడి, లేచి) ధ! ధ! మన పడమటా వేసనండి బాబు!

కుబే : నక్కతోకంత లేవు, నా కప్పుడే యెదురు చెప్పుతున్నావురా ! గాడిదా ! పచ్చేదూడకీ పోయేదూడకీ ఆ కాస్తపచ్చన కాయిదాగా లేకపోతే, చేనాగుద్దిరా ? కదలవేం కట్రాడులాగ ?

వెం : (కుంటుతూ పరిగెత్తబోయిపడి, లేచి కాలిరక్తం తుడుచుకుంటూ) ధ ! ధ ! తిరిగిందండి బాబు !

కుబే : ఓరి నీ మొఖంపుండా ! పోరా ఇక్కడనుంచి.

[వెంకన్న కుంటుతూ మరి రెండడుగులువేసి, కూలబడతాడు. కుబేరావు ఉగ్రుడై వెంకన్నను తన్ని తోసివేస్తాడు]

కుబే : (చిరాకుగా, కోపంగా తిరుగుతూ) పాలేరు పీనుగుకి పాటలెందు కంట ! వీడు పాడతాడని ఊరంతా గోలే. నా కెంత నామోషీ ! వీణ్ణి పాలేరుగా పెట్టుకుంది పాటలుపాడటానికా! ఓరి పని దొంగ గాడిదా, పనిదొంగ గాడిదా ! వీడిపని ఇలాకాదు.

(ఒకవైపుకు వెళ్ళబోయి, మరోవైపుకు పోతాడు. అంత తెర లేస్తుంది. పొలంలో మరోభాగం. బాల పుస్తకాలతో బడినుంచి ఇంటికి పోతూ ఉంటుంది పాడుకొంటూ—)

బాల : (పాట)

విశ్రమింపుము, విశ్రమింపుము
విశ్రమింపుము, మిత్రుడా !
విశ్రమించిన, నీవే రేపు
విక్రమింతువు మిత్రుడా !
పగలు పగలంతయును నీవే
పాలకుడవో మిత్రుడా !

జన్మమందిన దాది నీకి
శ్రమము తప్పదు మిత్రుడా!
విశ్వమునకే సేవకుడవై
విరిసివత్తువు మిత్రుడా!
రేయివచ్చెను, విశ్రమింపుము
రేపులేవగ మిత్రుడా!!

(ఒక గిత్తదూడ గంతులువేసుకొంటూ ఆమెవైపు వస్తుంది. బాల భయముతో "అమ్మో, అమ్మో" అంటూ రక్షణార్థం వస్తూవున్న వెంకన్న ఒడిలో పడుతుంది. ఆ సందడిలో బాల తలలో నగ జారిపడిపోతుంది. వెంకన్న ఆమెను విడిచి, గిత్తను అదలించి వెనక్కి తరిమికొట్టివస్తాడు. నగ చూడరు.)

బాల : (కంగారుతో) అమ్మో!

వెం : ఏం భయంలేదు బాలా! అది మా బుల్లాంబోతు. నీ రంగుచూచి బెదిరింది.

బాల : (ఆయాసపడుతూ) ఇక ఈదార్ని రానుబాబు!

వెం : ఏం, అది నిన్ను పొడవదు. రేపు దాన్ని లంకలోకి తోలేస్తున్నాం కూడాను. నే నిక్కడవుండగా నీకు భయమా?

బాల : (నిట్టూర్చి) అబ్బ! వెంకన్నా! ఒక గండం తప్పించావు. కృతజ్ఞతగా నీకేమివ్వను?

వెం : భాగ్యవంతుల బిడ్డవు. "వెంకన్నా" అని ఈ పాలేర్ని నోటార గౌరవించి పిలుస్తున్నావు, అంతే చాలు. ఒక దరిద్రుడు గొప్పవారిచేత మన్నించి పిలవబడటంకంటె కోరదగిం దేముంది?

(తెరలో పాట)

బాల : అదిగో! మా అన్నయ్య ఇలానే వస్తున్నాడు! అలాంటి పాటలు నేర్చుకో నువుకూడా.

వెం : నేనా? నేను వట్టి మ్రోడును.

(సుందరం పాడుతూ ప్రవేశం)

సుందరం :— (పాట)

పదరా, పదరా, పల్లెలకు
పల్లెటూరెరా భారతభాగ్యము ।
అజ్ఞానముతో, అధికారపు బహు
భారపు లోహపు పదములకింద,
క్రిమి కీటకములమాదిరి నలిగే
కృషికుల, శ్రమికుల కాపాడుమురా ।
పదరా, పదరా, పల్లెలకు
పల్లెటూరెరా భారత భాగ్యము ।
చీకటి కడుపున దాగిపోయి, ఈ
సృష్టి నిద్రపోయెడు నపుడైనా
విరతి యెరుంగనిగతి పర్విడు రవి
విధమున కార్యాసక్తుడవై । ॥పద॥

(చూచి) ఓహో ! చెల్లీ । ఇంకా ఇక్కడే వున్నావేం ? పోదాం రా. ఒరే, వెంకా ! మీ కామందుగారు ఊళ్ళోవున్నార్రా ।

వెం : చిత్తం ఉన్నారండి బాబు.

సుం : వీడేనా బాగా పాడతాడని చెప్పావు చెల్లీ ?

బాల : ఇతడే. ఎంచక్కా పాడతా డనుకున్నావు ।

వెం : నేనాండి ? అబ్బబ్బే. నాకేమీ రాదండి బాబు.

సుం : ఫర్వాలేదు ఏదీ, ఒక్కపాట పాడుచూద్దాం.

వెం : నిజమేనండి బాబు. దూడల్ని కాసుకొనేవాడికి పాట లేమొస్తాయండి ?

సుం : మీ కామందుగారు కొడతారని భయం వేస్తోందా ।

బాల : అలాంటోడే కుబేరయ్యగారు. అతనికి అసలు మాలాళ్ళంటేనే మంట. మేడమీదికెళ్ళి నువ్వు పాడుకుంటేనే దొడ్లో తను విసుక్కుంటూ వుంటాడన్నయ్యా ।

సుం : అతను కళకు శత్రువు.

బాల : అసలు నువ్వంటేనే ఆతడికి గిట్టదు. మొన్న నాతో అన్నాడు; 'ఏంటి మీఅన్నయ్య కుడీ-ఎడమా,మాలా-మైలాలేకుండా అందర్నీ అలా రాసుకు తిరుగుతాడు ?' అని. 'అందరూ మనుషులే' అన్నాను నేను.

(వెంకన్న కళ్ళల్లో కృతజ్ఞత కనుపిస్తుంది.)

సుం : అతడితో పేచీపడకు చెల్లీ ! అతడు మంచివాడు కాడు. వెంకా! పోనీ, మాదగ్గర కుదురుతావు ? రోజూ పాటలన్నా పాడుకుందువు గాని ?

బాల : ఇతడి పాట రోజూ నాకు వినాలనిపిస్తుంది.

వెం : తమదగ్గర కుదిరితే నే నెంతో బాగుపడుదునండి బాబు. నాలుగు ముక్కలు చదువన్నా అబ్బును, మాబాబు ఒప్పుకొనడండీ.

బాల : ఇతడి బాబేనా? వాడొక బుర్రలేని కొండముచ్చు.

సుం : ప్రొద్దుపోతున్నది. పాడితేపాడు లేకపోతే పోదాంమరి.

వెం : తమ లోగిలికివచ్చి పాడతానండిబాబు; దూడలు వెళ్ళిపోతున్నాయండి. కామందుగారు పుళ్ళి తన్నుతారండీ.

సుం : సరే ఐతే. చెల్లీ! పద,

బాల : తప్పకుండా రా– యేం!

(సుందరం, బాల నిష్క్రమిస్తారు. వెంకన్న కర్ర తీసుకోటానికి వంగి నగచూచి, ఎత్తి)

వెం : ఓహో! బాలది! ఇప్పుడే వారికి అందజేయాలి.

(వారికొరకు పరిగెడతాడు. తెర)

## రెండవ రంగం

(ఉదయం బడికి పిల్లల్ని తీసుకువచ్చే నిమిత్తం ప్రబోధం చేసుకుంటూ ఉపకారి రైతువాడ వెంబడి బైలుదేరతాడు.)

ఉప : ఓ తల్లిదండ్రులారా! మీబిడ్డల్ని బడికి పంపించండి!

సీ॥ గోచిపెట్టుట నేర్చుకొనగానె బిడ్డకు
చేతికి కర్రిచ్చు రైతులార!
నడువనేర్చినతోనె బుడుతని గొంపోయి
పాలేరు తనముంచు మాలలార!
పసిబిడ్డ తెచ్చు సంపాదన కాశించి
మనుగడలే మాపు జనకులార!
వంటయిల్లె జేసే ప్రపంచమ్ముగా జేసి
తనయల మెడగోయు తల్లులార!
జాతి శక్తి విహీనమై చచ్చుచుండ
కన్నులను మూసికొంటిరే గాఢ నిద్ర?
శక్తికంతకు మూలము చదువుకాన?
చదువ బంపుడు మీ తనూజాళి నింక!

ఓహో! పూర్వం విజ్ఞానసంపద కాలవాలమని పేరొందిన ఈ పుణ్యభూమి ఈనాడు పొట్టచించినా అక్షరం ముక్కలేని ప్రజలలో నిండిఉన్నది ఎంతఘోరం, దేశానికి ప్రజలే శక్తి. తట్టిశక్తి అజ్ఞానాంధకారంలో మునిగివుంటే దేశానికి బానిస తనమేగతి. మన బానిసత్వానికి మన అవిద్యయే ముఖ్యకారణం. దేశం స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో సౌఖ్యవంతం కావాలంటే ప్రజలు విజ్ఞాన భూషితులు కావాలి. ఓ భారత పుత్రులారా! మీ బిడ్డల్ని నూటికి నూరునుందిని విద్యావంతుల్ని చేయండి. బడికి పంపించండి.

(ఒక రైతు ప్రవేశం)

రైతు : (పరకాయించి చూచి, ముఖం త్రిప్పుకొని) పంతులా?

ఉప : ఔనండి. మీ అబ్బాయి—

రైతు : చెప్పక్కర్లేదు. అనుకుంటానే వున్నాను. ఏదో ఇంత వుంది. బ్రతకలేకపోడు. ఇలాపోనియ్యి.

ఉప : మీవంటి—

రైతు : అబ్బబ్బే ఇంకేమీ చెప్పొద్దు. (నిష్క్రమిస్తాడు)

ఉప : చదువంటే రైతుకెంత నీరసం!

(ప్రవేశం ఒక కూలి)

కూలి : (చూచి) పంతులుగారా! మావోణ్ణండి బాబు, కుబేరయ్యగారి పెత్తండ్రిగారి పొలాన్ని పెట్టేశానండి. ఇంక మీరు చూచుకో అక్కర్లేదు.

ఉప : పాలేరు తనమే!

కూలి : చిత్తం. ఎలా గడుస్తాదండి మరి?

ఉప : నీవు కడుపార కన్న ముద్దుబిడ్డనే నీవు—

కూలి : మీరు లచ్చచెప్పండి. అదేం నాకు తెల్దు, తమరు దయచెయ్యండి (వెళతాడు)

ఉప : (నొసలు బాదుకుంటూ నిలబడతాడు.)

(సుందరం ప్రవేశిస్తాడు)

సుం : మాష్టారూ! ఎలావుంది మీ ప్రబోధం? మొత్తంమీద మీరీవూరు వచ్చినప్పటినుంచీ వూళ్ళో కుర్రాళ్ళలో విద్యాభిలాష పొడచూపింది.

ఉప : ఏమో, చెప్పలేనండి. పేదరైతుల్లోనూ, కూలీల్లోనూ, ఇంకా చైతన్యమే లేదు.

సుం : ప్రభుత్వం నిద్రపోతూ వున్నంతకాలం అంతే. నిర్బంధ ప్రాథమిక విద్య అమలుజరపకుండా పేదల్ని మనంబడికి ఆకర్షించలేం.

ఉప : అంతవరకూ మడిగట్టుకుని కూర్చోవలసిందేనా? ప్రజాసేవకుల, నాయకుల ప్రబోధాలు అరణ్యరోదనా లేనా? నేటి అవిద్యకు కేవలం ఆర్థికదుస్థితి మాత్రమే కారణమంటారా?

సుం : ప్రజల మూర్ఖత్వంకూడా కారణమే అనుకోండి.

ఉప : అదే ముఖ్య కారణం.

సుం : నిరంతర ప్రబోధమే దానికి మందు. అది మీరు చేస్తూనే వున్నారు. చాలవరకు సఫలులయ్యారుకూడ.

ఉప : వెయ్యోవంతుకూడా కాలేదు. అయినా నిరాశకుమాత్రం నేను తావియ్యనులెండి. కాకినాడ వెళతారట,ఇంత త్వరలోనేమళ్ళీ....?

సుం : అవునండీ, పనుంది. మా బాల బాగా చతువుతున్నదా? కొంచెం ప్రత్యేకశ్రద్ధ తీసుకోవాలి మీరు. మా తల్లిగారు మీతో మరీమరీ చెప్పి వెళ్ళమన్నారు.

ఉప : ఆ విషయం మీరేమి చెప్పనక్కరలేదు. ఆమె నా చెల్లెలు.

సుం : కాకినాడ ఎప్పుడూ రారే!?

ఉప : ఈమధ్య రావాలనుకొంటున్నాను. వస్తే తప్పకుండ మీ దర్శనం చేస్తా.

సుం : మరచిపోకండేం. సెలవు. (నిష్క్రమిస్తాడు)

ఉప : ఓ భారతీయులారా!

గీ ॥ పుణ్యభారత భారతీ పుత్రులార!
కన్నబిడ్డ లజ్ఞానాంధకారమందు
ఒకరి నొక్కరు పట్టి కొట్టుకొనుచుండ,
విద్య అనియెడు కాగడా వెలుగుజూపి
ఏల రక్షించుకొనరు మీ బాలకులను?
విద్యలేని మనుష్యులు వింత పశువు
లన వినరె? పశుత్వమ్మె మీ కమృతమగునె?
బడికి పంపుడు విద్యనేర్పుడు, రవంత
ముందులకు బోవనిండు మీ ముద్దుసుతుల.

(నిష్క్రమిస్తాడు. అంత తెరలేస్తుంది. పొలం ఉదయకాంతుల్లో రమ్యంగా వుంటుంది. బాల మనోహరంగా అలంకరించుకొని, బడికి పోతూ ఆగి గొబ్బిపువ్వులాగి, తేనెగ్రోలుతూ.మధ్య మధ్య పాడుతూ వుంటుంది. చుట్టూ బెదరుచూపులు ప్రసరిస్తుందికూడ.)

బాల:— (పాట)

ముళ్ళమొక్కల ముద్దుల ముద్దులపూలు,
ముద్దుపూపుల మురిపెపు తేనెల్
నా కొరకేనా!
నా తల్లి!

తెలుగు పొలములో తెల్లవారెనోయ్,
పూవులు విరిసీ తావులు పిలిచే
తెలుగు యువకుడా!
మేలుకొన రాదా?

ముళ్ళగ్రుచ్చకే పువ్వుల నీవే
తీరదు దాహము తేనెలు చేవే?
ఏమిచేతువో
ఏమో తల్లీ!

(అంత వెనుకనుండికుంటుతూ, కాలికికట్టినకట్టుతో ప్రవేశిస్తాడు వెంకన్న- బాలనుచూడాకుండా రెండుమూడు గొబ్బి పువ్వులు చవిచూచి బాలను చూస్తాడు. దగ్గరకు వస్తాడు.)

వెం : బాల! అమ్మదొంగ! నీవా! రోజూ ఈ పువ్వుల్లో తేనంతా పీల్చేస్తున్న తుమ్మెదవు నీవా?

బాల : ఇంతప్రొద్దెక్కి ఎవరు రమ్మన్నారు నిన్ను?

వెం : నీకేం? మహారాణివి! కోయిలతోలేస్తావు, పెరుగన్నం తింటావు, తల్లో పువ్వులు పెట్టుకుంటావు, పుస్తకాలు పుచ్చుకొని బళ్ళోకి బైలుదేరతావు.

బాల : నీవుమాత్రం కోయిలతో లేవగూడదా? పెరుగన్నం తినగూడదా? క్రాంపింగులో పువ్వులు పెట్టుకో కూడదా? ముందేవచ్చి ఈ తేనంతా గండుతుమ్మెదలాగ త్రాగెయ్యగూడదా? ఎవరొద్దన్నారు!

వెం : (విచారముతో) నాకా అదృష్టమా? నేను కోడికూతతో లేవాలి. కామందుల ఇంటికి వెళ్ళాలి, దూడల్ని మార్చాలి. దొడ్డిఊడ్చాలి. పేడచిమ్మాలి, పాచి పనులన్నీ చెయ్యాలి. దూడల్ని విప్పుకొని. పొలం వచ్చేటప్పటికి ఈ వేళ అవుతూ వుంటుంది.

బాల : పాపం! (జాలిగా)

వెం : నా సంగతికేంలే బాలా! నాకు కాలమంతా ఒక్కటే. నీకు ప్రొద్దెక్కిపోవటంలేదూ? మాష్టారు కొట్టరూ!

బాల: ఎందుక్కొడతారూ! బాగా చదివే పిల్లల్ని ఏమి అనరు. మా మాష్టారు చాల మంచివారు.

వెం : గొబ్బి కంపలమీద అడుగు వెయ్యకేం, ముళ్ళురుగుతాయి....నీ పాదాలకి కంపలైనా ముళ్ళు ముడుచుకొని పువ్వుల్నే ఇస్తాయిలే. (కళ్ళు తుడుచుకుంటాడు)

బాల : నీ కళ్ళు చెమ్మగిల్లాయేం? అంత నీరసముగా వున్నావేం? కాలికి ఆ కట్టేమిటి? పొద్దున ఏం తినివచ్చావు?

వెం : ఏం తిన్నాను నా ముఖం? నిన్నటినుంచి ఏమన్నా తిన్నానా!

బాల : ఆఁ, ఏం తినలేదు?

వెం : పోనీలెద్దూ!

బాల - మరెలాగ? ఎలా వుంటున్నావ్?

వెం : నా కలవాటే. కామందులకు కోపంవస్తే చావదన్ని చప్పగా మాడేస్తారు. పొట్టిగిత్తను తిరగేస్తుంటే విన్న నెరబొత్తలో పడి కాలు బెణికింది. దూడను నిలబడి ఆదలించాననని మాకామందులు తన్ని తంపపేశారు!

బాల : మరెందుకీ పాలేరుతనం?

వెం : గతిలేక.

బాల : మరి మీ బాబున్నాడుగా.
వెం : అతడికంటె మా రామందే నయం.
బాల : పాపం. మరెలా గిప్పుడు?
వెం : ఏం?
బాల : నీకు ఎంత ఆకలిగాఉందో? ఎలాగ!
వెం : నాగురించి ఆలోచిస్తున్నావా? వద్దు. వద్దు బాలా, నీ కృపకు నేను కృతజ్ఞుణ్ణి. ఇకవెళ్ళు. నీకు ప్రొద్దుపోతుంది.
బాల : (సంచిలోనుంచి తీస్తూ) కొబ్బరి తింటావా!
వెం : వద్దు. పస్తుండటం చేతగానివాడు పాలేరుతనం చెయ్యలేడు.
బాల : బెల్లంకూడా వుంది.
వెం : నాకేమీవద్దు. నీఆహారంతో నేను ఆకలి తీర్చుకోలేను.
బాల : ఇవి నా కాహారంకాదు. నేను గొంతువాకా తినే బైలుదేరాను. బళ్ళోపిల్లలకు పెట్టెయ్యటానికే.
వెం : నాకువద్దు. కొబ్బరి నాకు పడదు.
బాల : అన్నం అక్కర్లేకుండా ఒక్క కొబ్బరితినే జీవించ వచ్చునని మా మాస్టారు చెప్పారు.
వెం : ఐనా సరే: నాకువద్దు. నన్ను బలవంత పెట్టవద్దు.
బాల : (అభిమానంతో) వద్దా:
వెం : వద్దు.
బాల : వద్దా? ఇదిగో చిమ్మేస్తున్నా. (చిమ్మబోతుంది)
వెం : ఆ(! ఆ(! (వారిస్తూ) తప్పుకాదూ?ఆహారాన్ని ఉత్పత్తి చెయ్యాలే గాని, నాశనం చెయ్యటం ఎంత పాపం?
బాల : ఉత్పత్తి అయిన ఆహారం సద్వినియోగం కాకుండా మూలపడి వుండి. నీవంటి కష్టజీవులంతా మలమల మాడిపోతూ ఉండటం పాపంకాదా?....వద్దా?
వెం : ఏదీ—(దోసిలిబట్టి స్వీకరించి) మహాప్రసాదం.
బాల : (ఆనందంతో) రోజూ మా అమ్మ నా సంచిలో ఏదోవేస్తూనే వుంటుంది. అది మనకిద్దరకూ సరిపోతుంది ఏం?

వెం : నా పాలిటి అన్నపూర్ణవు. బాలా, రేపటినుంచి నాకేమీ తేవద్దు. తెస్తే మరి నీకు నేను కనపడను.

బాల : చూస్తాన్లే ఎలా కనబడవో! (చూచి) అదిగో మాష్టారు యిలానే వస్తున్నారు. నే వెళతాను (సంచితో పరుగెత్తుతుంది.)

వెం : (దోసిట్లోకి చూసుకొంటూ, కన్నీరు నించుతూ) 'నీ కెంత ఆకలిగావుందో. ఎలాగ?' నా తల్లిపోయిన తర్వాత ఆ మాత్రపు జాలిమాట నేటికి విన్నాను. పాలేరువాణ్ణి చూచి జాలిపడే దయగలవాళ్ళు లోకంలో వున్నారే! పరమేశ్వరా?

(పాట)

ఆకటదూలీ అలసిస బ్రతుకున
ఆశే ప్రాణము — దేవా!
కాలే కడుపుకు - మండే బూడిద
కమ్మనికూడో - దేవా:

ఆకురాల్చి మోడైన చెట్టునకు
అలరుగాలమో దేవా!
అంధకారమున మగ్గే జీవికి
అరుణోదయమో- దేవా!

రాలే పూలకు మొలిచే మొగ్గలు
ప్రాణములోయీ- దేవా!
మనుజులలో యీ మాత్రపు సత్యము
మరుగై యున్నది - దేవా!

(ఒక వైపునుండి ఉపకాసి, ఒక వైపునుండి వీరేశు ప్రవేశిస్తారు.)

ఉప : వెంకన్నా, చక్కగా పాడతావురా! ఏ సినిమావాళ్ళో యెత్తుకు పోతార్రా ఎన్ను!

వీరే : అందానికి నేను, సంగీతానికి మా అప్పఅన్నట్టు యేం పాటలండీ పంతులుగారూ? పాలేరోళ్ళకి పాటలెందుకండీ? దూడని తిర

గెయ్యడం చేతకాదు మాపోడికి. తాలింపులో నీళ్ళచుక్కలాగ 'చుంయి' మంటే యేమొస్తందండి బాబు ?

ఉప : కాదురా వీరేశు ! మనం బ్రతకడం వట్టి పాలేరుతనం కోసమే అంటావా ?

వీరే : పంతులుగారిచేత తినేతన్నులకంటే కామందుచేత తినే తన్నులకు యిలవెక్కువండి బాబు ! నేను మొదట్లో మాబాబు బాధపడలేక బళ్ళోకెల్లానండి. ఆ పంతులు రోజూ పట్టుకు తన్నేవోడండి— బళ్ళోకెళ్ళకపోతే మాబాబు తన్నేవోడండి. ఎందుకొచ్చిందిరా దిక్కుమాలిన చదువని-పారిపోయి పాలేరుతనానికి కుదిరానండి బాబు, పంతులుగారు !

వెంక : ఆహా ! ఎంత ఆదర్శప్రాయుడో వీరేశుతండ్రి !

ఉప : వీరేశు ! ఇపుడు నీకు జీతమెంత ?

వీరే : నాలుక్కుంచాలండి-నాలుగు !

ఉప : స్వతంత్రమైన వృత్తిలో అంతకన్న ఎక్కువ సంపాదించలేవా ? పోనీ-చదువక్కరలేదనుకో. మనిషిగా గౌరవంగా బ్రతికే మరో వృత్తి చేసుకోగూడదా ?

వీరే : నా కదంతా తెల్దండిబాబు.

వెంక : పోనీ-తెలిసికోడానికి ప్రయత్నమైనా చెయ్యవద్దా ?

వీరే : చెప్పావు - నోరుమూసుకోవోయ్, గుడ్డెల్లి పిల్లనెక్కిరించినట్టు. నిన్న తిన్న తన్నులు చాలవు నీకు !

ఉప : తన్నులా ? వెంకన్నా ! నీవు ఈ పాలేరుతనం రొంపిలో ఎలా పడ్డావురా ! బడికి వచ్చేశెయిరా.

వీరే : నాకు తెలవక అడుగుతానండి బాబు. చదువు కూడెడత దంటారా?

ఉప : ఎందుకు పెట్టదు ?

వీరే : మరి ఈ చదువుకున్న కుర్రకుంకలంతా అలాతిరుగుతారేం, వీదులంట, ఈతరుప్పల్లాగ తల్లిరబోసుకొని ?

ఉప : అది చదువురాని, పరీక్షలు ఫేలయిన, మొద్దుసరుకు చేసేపని. అది చదువు తప్పా ?

వీరే : ఇంతింత తల్లు పెంచుకొంటారండి, ఒకొకళ్ళు.

ఉప : వీటినే వెట్టితలలు అంటారు చదువురానివాళ్ళు. పశువులతో సమానం. మామూలు పశువులుకావు. వింత పశువులు.

వీరే : నాకు 'కా' గుణింతందాకా వచ్చునండోయ్. ఏమనుకుంటున్నారో?

ఉప : గొప్ప చదువరివే!

వీరే : మా రామంమగారికి 'యిత్రా' గుణింతం దాకా వచ్చునండి.

వెంక : భలే (నవ్వుతాడు)

వీరే ; నువ్వు నవ్వుతావోయ్ నీపని పట్టిందాకా !

ఉప : సరే-వెంకన్నా, నువ్వు మీ బాబుని మరోసారి గట్టిగా అడుగు, బళ్ళోకి పంపించమని·

వీరే : గట్టిగాఅడిగితే గట్టిగాతన్నమని పుల్లయ్యతో చెపుతా.

(వెళ్ళిపోతాడు)

ఉప : ఈ శనిగాడేమిటి నీకు ?

వెంక : తోడి పాలేరండి, ఇతడెప్పుడూ ఇంతే. చాడీలుచెప్పి మాబాబు చేత, కామందులచేతా తన్నిస్తాడండి నన్ను.

ఉప : అబ్బే నీవు ఈ నరకంలో ఉండలేవు. బళ్లోకి రావడానికి తీవ్రంగా కృషిచెయ్యి నీకు పుస్తకాలు, బట్టలూ నేను ఇస్తాను. ఏదీ నిన్నటి పుస్తకం?

వెంక : (తలపాగలోనుంచి తీసిఇస్తూ) ఇది చదివేశానండి. ఇంకో పుస్తకం ఇప్పించండి.

ఉప : రేపు తీసుకొస్తాను. మన బడిసాలలో రేపటినుంచి రాత్రిబడి పెడుతున్నాం. నీవుకూడా రా. పెద్దవాళ్ళయిన పాలేళ్ళకీ, రైతులకీ చదువు చెప్పడానికి రాత్రిబడి.

వెంక : చిత్తం. తప్పకుండ వస్తానండి.

ఉప : ఇక పోయివస్తా. ఏ సంగతీ ఈవేళ తేల్చుసుకో.

(నిష్క్రమిస్తాడు)

వెంక : ఈవేళ నేను లేచినఘడియ మంచిది. నాజీవితం దారి తప్పుతూ వుంది.

(పాట)

దారితప్పిన బాటసారీ!
ధైర్యమోయీ బాటసారీ!
మింటిచుక్క - మిణుగురుర్వ
కంటికంతా చీకటౌనా?
అరుణరాగము అమృతగానము
అర్ధరాత్రికి అంతులేదా?
కంటిలోపలి కాగడాతో
మింటివరకూ చూడలేవా?
కట్టురాడుగ నిలువనేలా?
పెట్టుమోయీ అడుగు ముందుకు,
దారికంటక పూర్ణమైనా
ధైర్యశాలికి భారమౌనా?

(మెల్లగా తెర జారుతుంది.)

—)·(—

# మూడవరంగం

(కుబేరయ్యగారి ఇల్లు, మధ్యాహ్నం. వీరేశుతో మాట్లాడుడూ కుబేరయ్య ప్రవేశిస్తాడు........ )

కుబే : అదట్రా ? అదాసంగతి ? ఒక్క సంగీతమే అనుకున్నాను. సాహిత్యం కూడానా? ఓరివీణ్ణి తగలెయ్యా!

వీరే : రాత్రి బళ్లోకి వెళ్ళుతున్నాడండీ.

కుబే : ఆఁ। రాత్రి బడే। ఆ పంతులుగాడు చేస్తున్నాడ్రా ఇదంతా— వాణ్ణి పాతెయ్యా। సరే। నువ్వుపోయి ఆ పుల్లణ్ణ పిలు,

వీరే : మీకు 'యిర్రా' గుణింతందాకా వత్తాదని నే నంటే నవ్వాడండి.

కుబే : (ఉగ్రుడై) ఆఁ। దున్నపోతు? నవ్వాడు। ఆ నవ్విన నోటే ఏడి పిస్తా।

వీరే : చిత్తం అదండి. (వెళతాడు)

కుబే : ఓరి వీళ్ళమీద బాంబులుపడా। చంపేస్తున్నారు. పేద పిసుక్కునే వెధవలకి చదువులూ, సంగీతాలూనా।

పుల్లయ్య : (ప్రవేశిస్తూ) దండాలుండి బాబో।

కుబే : పుల్లిగా! నీ బాబుకి గోచీపెట్టడం చేతనవునూ?

పుల్ల : చిత్తం, బాబయ్యా।

కుబే : కాదురా నీకు పంచికట్టు చేతనవును?

పుల్ల : చిత్తం బాబయ్యా!

కుబే : ఓరి దున్నపోతుకొడకా। మీ ఇంటావంటా ఎప్పుడైనా చదువుందిరా?

పుల్ల : బాబో। అదాండి। లేదండి బాబు లేదండి.

కుబే : మీలో చదువుకోవడం పాపం కాదంట్రా?

పుల్ల : బోల్డంత పాపం బాబయ్యా। మహా ఘోరపాపం కాదండి। మా తాతనాడుగాని, మా బాబునాడుగాని, నేనుగాని, నా కొడుకు యెంకడుగాని....

కుబే : అగరా! నీదాకా బాగానేవుంది. యెంకడితో మీ ఆ న్యాయం అంతా మట్లో కలిసిపోయింది.

పుల్ల : లేదండిబాబు నాతోడండి, నా పేణం తోడండి, నా దల్లాటోడు కాదండి.

కుబే : ఊరుకోరా! వాడోదొంగ, నువ్వో దొంగవు!

పుల్ల : (గుండె బాదుకొంటూ) నేనాండి? నేనే? దొంగనే? ఇంతటోణ్ణయాను- ఒక్క పుల్లముక్క ముట్టుకున్నానా తమ కమతం లోది? ఇంకా చూసుకొండి ఏమి దొంగతనం చేశానో, ఎక్కడ దాసుకున్నానో! (పాగా, పంచీ దులుపుతాడు.)

కుబే : ఓరి మట్టితలకాయ గాడిదకొడకా! అదికాదురా పాలేరుతనం చేసుకు బ్రతికే తొత్తుకొడుక్కి చదువేమిటిరా? చదువు?

పుల్ల : ఎవడికండి బాబు! పొట్టచించినా అచ్చరంముక్క వుందాండి నాకు?

కుబే : అబ్బబ్బా! చంపేస్తున్నావురా! మీ యెంకడ్రా!

పుల్ల : (ఉలిక్కిపడి) అమ్మ నాయనోయ్!

కుబే : వాడింక పనికిరాడురా.

పుల్ల : ఓరి దేముడోయ్. (గుండె బాదుకుంటాడు)

కుబే : పని ముట్టుకోవడంలేదు. అస్తమానం పాటలూ, పుస్తకాలూ! పాలేరుతనం మానిపించెయ్. చదివించి కలగచేరు పని చెయ్యించు —పో!

పుల్ల : (బోకారి) గులాపోళ్ళం బాబయ్యా! రచ్చించండి బాబయ్యా! ఆ గాడిదకొడుకుని తన్ని తంపటేసేత్తా. ఉప్పు పాతర్ని పెట్టేత్తా. తమచేతి కద్ద మేముంది? పక్క లిరగబొడవలేకపోయారా?

కుబే : ఏదో అన్నాన్లే. వాడికి సరిగా బుద్ధిచెప్పగల్గితేనే వుంచు లేకపోతే మరోదారి చూచుకో. ఏదో చిన్నప్పటినించి ఆశ్రయించుకుని వున్నవాడివి కాబట్టి ఆలోచిస్తున్నాను. సరే పో. (విష్క్రమిస్తాడు)

పుల్ల : (ఒక కర్రతీస్తూ) ఎంకడి వొంటిమీద యీ కర్ర తుక్కైపోవాలి. నా కడుపున చెడబుట్టాడు. ఇంత మొగోణ్ణయాను. ఒక్కమాట యెదురు సెప్పానా కామందుగారికి? ఎన్ని తిట్టినా, ఎన్ని కొట్టినా

కామందుగారి కాళ్ళేపట్టుకుని బతికానుకాని, యీ ఎధవలాగ చదువో చదువో అని యేడ్చానా?

వీరే : (ప్రవేశించి) ఏంటి మామా, హడావిడి?

పుల్ల ; కాదురా. యీరేశు! నువ్వూ మా యెంకడి తోటోడివే కదా? చూడు, ఎంచక్కా చేసుకుంటువ్నాడో పని? మా కుర్రగాడిదకొడుకు....

వీరే : ఆడికేనా — అమ్మ. ఆడికి చదువు లెక్కువై పోయాయి— చదువులు!

పుల్ల : నా ఖర్మంరా బాబు! నా ఖర్మం.

వీరే : మాబాబు నన్ను బళ్ళోకెళ్ళమని చితగ్గొట్టేవాడు. బళ్లో- పంతులుగారు కోదండం వేయి..చేవాడు. ఐనా సరే- తప్పాగొయ్యి నేను చదువుకున్నానా!

పుల్ల : బుద్ధిమంతుడవ్వురా! నువ్వు బాగుపడేవోడివి గనక ఆ బడికి తగులబడకుండా బతుకుతున్నావు. మా దద్దమ్మకి చదువు కావాలంట. పాపిష్టి చదువు.

వీరే ; యెంకడికి కొంచెం బలిసిందిలే .. వొదలగొట్టు.

పుల్ల : కొంచెమేంటి? అంతా పదలగొట్టేత్తాను. ఆవొచ్చే వోడేగా? రానీ-

వీరే : ఆడే, ఆడే. నే పోతాను. నేను చెప్పి కొట్టించానంటాడు మళ్ళీ. (పోతాడు)

పుల్ల : చావగొట్టి చెవులుమూత్తా నీ వేళ, రా. రా.

వెం : (చేతులుమోడ్చి, ప్రవేశిస్తూ) దండం బాబోయ్.

పుల్ల: నీకు కర్రావోరి అమ్మాయిని పెళ్ళిచేత్తాను రా. రా. రా! (జబ్బ పట్టుకొని) నువ్వేంటి పుత్తకాయి చదివేత్తున్నావంట?

వెం : ఇంకెప్పుడూ చదవను బాబోయ్.

పుల్ల ; అమ్మ గాడిదకొడకా! చదువుతున్నావూ? (ఒకటి కొడతాడు.)

వెం : కొట్టకు బాబో! ఇంకెప్పుడూ చదవను బాబో?

పుల్ల : ఇప్పుడుదాకా చదివిందంతా మరచిపో!

వెం : ఎలా మరచిపోను? బాబో!

పుల్ల : అ(! మరచిపోలేవు? (కొడతాడు. వెంకన్న భోరున ఏడుస్తుండగా

ఉపకారి వస్తాడు.)

ఉప ? ఏమిటయ్యా, అది?

పుల్ల : మా కుర్రవెధవకి పొగరు బలిసిందిలెండి. వదలకొడుతున్నాను.
(మళ్ళీ కొట్టబోగా వెంకన్న పారిపోతాడు)

ఉప . పుల్లయ్యా! బంగారంలాంటి ఆ కుర్రవాణ్ణి ఎలా పాడుజేస్తున్నావు!

పుల్ల : పనికిమాలినవెధవండి. పాలేరుతనం చెయ్యలేనివాడు ఒక మనిషే
అంటారా?

ఉప : అయ్యయ్యో! పాలేరుతనమా? పాలేరుతనమూ ఒక వృత్తే
అంటావా? స్వతంత్రంగా బ్రతికే మనిషే మనిషి. అంత
ఎందుకు? వెంకన్నను నాచేతిలో పెట్టు. అతణ్ణి ఒక మహారాజా
లాగ తయారు చేస్తాను.

పుల్ల : చెప్పా వెల్లవయ్యా. తెల్లబట్టేసుకుంటే నేనూ అవుతాను మహా
జాని. మరి కడుపులోకో?

ఉప : ఆపిల్లవాడి వయస్సెంత? వాడు తెచ్చే జీతమెంత? పసిపిల్లల కష్టం
తిని బ్రతికే తల్లిదండ్రులు మనుష్యుల్లో లెక్కేనా?

పుల్ల : ఒస్, పోవోయ్. ఈపాటికి- పుట్టావు పిల్లల్ని పాడుచేయడానికి.

ఉప : నీవు పాలేరువు. నీ బిడ్డనుకూడా పాలేర్ని చేస్తావా? అంతకంటే
ముందుకు పోనివ్వవా? పాలేరు తరతరాలకు పాలేరే అన్నమాట?

పుల్ల : అన్నమాటలేదు, తమ్ముడుమాటాలేదు. యెల్రా. యీ పాటికి
నువ్వెంతయేడ్చినా నాకొడుకును బడిలోకి పంపను.

ఉప : అయ్యయ్యో!

పుల్ల : చదువు మా అయాంలో లేదు. మాకు చదువు అచ్చిరాదని మా
కామందుగారు చెప్పారు. అచ్చరాలా అంతే. 'అ, ఆ' లు దిద్ద
మోయి మా తాత కాలిరిగి చచ్చాడంట. మాబాబు రాగాం తియ్య
మోతే పచ్చరాలి చచ్చాడంట.

ఉప : పాపం ఎంత అమాయకత్వం!

పుల్ల : ఆఁ, ఏంటి ? యెధవకూతలు కుయ్యకు పో. ఈ రోజు మొదలు ఈ చుట్టుపక్కల కనిపించావంటే చూసు మరి. చచ్చినా సరే మావోణ్ణి బడికి పంపించను. పో-పో. (దురుసుగా పోతాడు.)

ఉప : ఓహో! మూర్ఖుడైన తండ్రికి కొడుకై పుట్టటం ఎంత దురదృష్టం! మూర్ఖుడైన పుల్లయ్యకు పుట్టటం అనే ప్రమాదం జరగటం వల్ల గదా వెంకన్నవంటి రత్నం మట్టిగొట్టుకు పోతున్నాడు! అంధకారం అధికమౌతున్న కొలది వెలుగుచూపేవాని బాధ్యత ఎక్కువవుతూ ఉంటుంది. అవిద్యను పారద్రోలడానికి నా శక్తి సామర్థ్యాలన్నీ ఉపయోగిస్తాను. పాపం వెంకన్న స్థితి!

గీ. రాజవనమున పూసిన జాజిపువ్వు
రాణి కుచహారమున ముద్దులానగలదు;
పాడునూరను బూచిన పద్మమైన
అంధ తిమిరాల అజ్ఞాతమై యడంగు.

[నిష్క్రమిస్తాడు.]

—)(—



# నాల్గవ రంగం

[పొలంలో దూడల్ని మేపుతున్న వెంకన్న. ప్రభాత సమయం. కాలికి కట్టు కట్టుకొని, మధ్య మధ్య పుస్తకం తీస్తూ. పాడుతూ వుంటాడు.]

వెంకన్న :—

(పాట)

కాళ్ళబడిపోయేటి గడ్డిపూలారా !
సుందరాంగుల జటా శోభమీకున్నదా ?
లోతు సంద్రాలలో పాతుకొన్న మణీ !
భరతమాతను గొల్చు భాగ్యమ్ముగల్గునా ?
దూరానగల పల్లెటూరి బాలకుడా !
దేశభక్తి జాడ తెలిసి వర్తింతువా !
తడిలేని మడిలోన కడుబీట బడియేడ్చు
ఓ తల్లి ! నీ కేక కొకడైన పల్కునా ?

ఊళ్ళో కామందుచేత దెబ్బలు, ఇంటికాడ తండ్రిచేత తన్నులు ! ఓ పాలేరా ! నీ జీవితం ఎంత దుఃఖకరం ! అయ్యో, నా పసితనానికి చీడపురుగు పట్టిందే ! ఇకనాకు ఎడగు బొమగులు లేవా? అంతరాత్మను చంపి చిన్నప్పటినుంచే పసిబిడ్డను ఒక పశువులాగ తయారు చేసే పాలేరుతనం నాకు దాపరించిందే ! అయ్యో, పాలేరుకు చదువు పనికిరాదా ? చదువు స్వతంత్ర భావాల్ని కలిగిస్తుందనా ? చదువుకున్నా అస్వతంత్రులు బానిసలై ఎంతమందిలేరు? ఇకనాకుదిక్కేది ? ఈ నరకం నుంచి బయటపడే దారేది? చదువు సంధ్యల్లేక, ప్రపంచమంటే ఏమిటో తెలియక, నూతిలో కప్పలాగ, పగ్గంపోసి కట్టిన పశువులాగ, ఏదో ఇంత గడ్డి తింటూ బ్రతకనా ? అదిగో ! ఆ బడికిపోతున్న పిల్లలు ! ఆహా ! ఎంత కులాసాగా పోతున్నారు బడికి !

వాళ్ళ యీడువాణ్ణి కానా నేను ! వాళ్ళు పొందే ఆనందదానికీ అభివృద్ధికీ నోచుకోలేదా నేను ? అయ్యో ! తండ్రీ ! ఈ రొంపిలో

నన్ను త్రొక్కేశావే। ఈ ఊబిలో నన్ను కూరేశావే। పాలేరు తనమే పరమావధి చేశావే। ఓరిబాబు। నీవు రాక్షసుడవా?
బిడ్డల్ని బడికి పంపించక, విద్యాబుద్ధులు చెప్పించక పాలేరు తనాలు పెట్టి, ఆ పసిబిడ్డల కష్టంతిని బ్రతికే ఓ తల్లిదండ్రులారా! మీరు యెంత నీచులు! ఛీ! మీ ముఖం చూడగూడదు.
ఓ పెద్ద పాలేరా! నీ కొడుకును చిన్న పాలేర్ని చేస్తావా? నీ చేతి కర్ర, నీ చెప్పుదెబ్బలు, నీ గంజికూడు తప్ప నీ ముద్దుల కొడుకును ఒక్క అడుగైనా ముందునకు వెయ్యనియ్యవా?
ఓరి దరిద్రుడా! నీకన్న దరిద్రులు యెంతమంది తమ బిడ్డల్ని చదివించుకుంటున్నారో అలా చూడు। నీ నీచత్వానికి కారణం పేదరికం కాదు. తెలివి తక్కువతనం—మూర్ఖత్వం, అబ్బా! ఈ పాలేళ్ళంతా గొడ్డుమోతులై పోతే యెంత బాగుండును! ఇక నాకేది దిక్కు? ఏది దారి? బానిసగా బ్రతికేకంటే మరణం మేలుకాదా?
ఇక నాకు మరణమే శరణ్యం. పాలేరుగా బ్రతకలేను. విద్యావంతుణ్ణి కాలేను. ఈ పర్రనూతిలోపడి యీ దరిద్ర దాస్య జీవితాన్ని ముగించేస్తాను. అంటరాని అసహ్యకరమైన, ఈ నా నికృష్ట జీవితం—స్వతంత్ర నాగరిక జాతికి ఒక మచ్చ. ఇది నే భరించలేను. (నూతిదగ్గరచేరి చేతులు మోడ్చి) ఓ పరమేశ్వరా?

సీ. మాలను గావించి - పాలేరుగా జేసి
     కామందు కాలికి - గట్టినావు
  అంటరాదని చెప్పి పెంటల పాల్జేసి
     నీచుల మనుపేర నిల్పినావు.
  చదువు సంధ్యలులేక జంతువులను బోలె
     ఊరి వెల్పల చావ నుంచినావు
  అజ్ఞానతిమిరాల యడుగున బడద్రోసి.
     బరువుగా యెదనెక్కి పట్టినావు.
  వెలుగు జూపవు. నేర్పవు మెలగుజాడ,

దాస్యమును బాపుకో నీవు, ధైర్యమూని
మనిషిగా నన్ను మననీవు, మహినికేల ?
చంపుకొని పొమ్మ, చాలింతు జన్మమింక !

(నూతిలో దూకబోతూ వుండగా తెరలోపాట వినిపిస్తుంది. ఆగి వింటాడు. బాల బడికిపోతూ తెరలోనుంచి పాడుకొంటూ వస్తుంది.)

బాల : (పాట)

ధైర్యము విడిచెదవా ? వీరా !
దాగుదువా తెరలో ?
పరకను పామని భయమొందుదువా ?
పిరికివాడవై పరువెత్తుదువా ?
బానిసత్వమని బాధపడుదువా ?
స్వేచ్ఛా జీవితమే గొనలేవా ?
ఓ యువవీరా ! ఉత్తేజముతో
సాగిన నీ దాస్యము విడిపోదా ?
నిస్పృహ యేలా ? నీ హృదయములో
సోమరితనముకు చోటీయకుమా !
విక్రమింపుమా - వీరుడవై
విజయము నీ దేరా !

(హఠాత్తుగా వెంకన్ననుచూచి) అదేమిటి వెంకన్నా ! దైవాన్ని ప్రార్థిస్తున్నావే !

వెంక : (కన్నీరు తుడుచుకుంటూ) ఏమో - ఆపత్కాలంలో అలవాటు చొప్పున తలచుకోవటమేగాని, నిజంగా దేవుడున్నాడనే నమ్మకం నాకు లేదు. పోనీగాని నీకు ప్రొద్దెక్కుతున్నది. త్వరగా పో బడికి.

బాల : ఫర్వాలేదు కాని - నీవు రోజూ రోజూ అలా నీరసపడిపోతున్నావేం ? ఆ దెబ్బలేమిటి ? అమ్మో ! రక్తం కారుతున్నది. కట్టు కట్టనా ? (ప్రయత్నిస్తుంది.)

వెంక : (వారిస్తూ) వద్దుబాలా వద్దు. నీ బంగారు చేతులు నెత్తురవుతాయి.
బాల : ఆ వెధవ పాలేరుతనం మానేద్దూ!
వెంక : నా కా అదృష్టం లేదు.
బాల : ఊరకే కూర్చుంటే యెలా వస్తుంది అదృష్టం?
వెంక : పాలేరుతనం తప్ప నాకు గత్యంతరం యేముందీ?
బాల : బడికి రా!
వెంక : బడికా? అమ్మో! ఆ మాటెత్తితే మా బాబు గొయ్యి తీసి పాతేస్తాడు.
బాల : మీ బాబుకి నచ్చ చెప్పలేవా?
వెంక అసలు చెప్పనిస్తేగా, నచ్చజెప్పడానికి?
బాల : అయ్యో! అంత పశువా?
వెంక : ఏమో నా కదంతా తెలీదు. నాకు పాలేరుతనం తప్పదు. అది నేను చెయ్యలేను.
బాల : మరి?
వెం : మరి—లేకుండా పోవడమే.
బాల : అంటే?
వెం : అంటే-మరణమే. దాంతో యీ బాధలు, బెంగలు ఆకలి, అవమానంఅన్నీ నన్ను వదలిపోతాయి.
బాల : చాల్లే-కాని ఆకలంటే జ్ఞాపకం వచ్చింది. నేనుండగా నీకుఆకలా (సంచికలోనుంచి అరటిపండ్లు తీసింది.)
వెం : (నిరాకరిస్తూ) తేవద్దని చెప్పలే. నీ ఆహారం నేను తీసుకొని, నాఆకల్ని నీకు అంటగట్టనా?
బాల : ఇవి నీ కోసమే తెచ్చా.
వెం : మీ తల్లిగార్ని అడిగి తెచ్చావా?
బాల : లేదు.
వెం : నాగురించి నీవు దొంగతనం చేశావా?
బాల : నా సొమ్ము నాకు దొంగతనమా?
వెం : చాటుగా తెచ్చావా లేదా?

బాల : తింటావా, తినవా ?
వెం : నాకు వద్దు.
బాల : గిరాటేస్తున్నా. (గిరాటెయ్య బోతుంది)
వెం : .... .... .... ....
బాల : చ పక తీసుకోందూ।
వెం : ఇతరుల సొమ్ము నాకువద్దు.
(బాల కోపంతో పళ్ళు గిరాటేసి పోతుంది)
వెం : (చెమ్మగిలిన కళ్ళతో) ఆహా। ఎంత దాక్షిణ్యం।

(పాట)

ఈ యెడారిలో మబ్బునీడలా
ఓయాసిసులా దేవా?
నడి సంద్రములో జడివర్షములా,
నౌకాశ్రయమా, దేవా ?
వేసవి నడి మధ్యాహ్నములో- చలి
వేంద్ర గట్టితివె దేవా।
వడగొట్టిన యీ బాంధుని నోటికి
పాయసాన్నమూ దేవా।

కుబే : (దురుసుగా ప్రవేశించి) ఒరే। గాడిద కొడకా। నీకు బ్రతికే రోజులు లేవురా ? (వెంకన్నను కొడతాడు) చదువుకునే పిల్లలతో స్నేహమంట్రా? దున్నపోతా। (మళ్ళీ కొడతాడు. పుస్తకం చూచి) పుస్తకమే। వీడే। పాపంరా। ఓరి పాపిష్టి ముండాకొడకా। (పుస్తకము చింపి పారేస్తాడు. అరటి పండ్లుచూచి) అరటిపళ్ళే। ఎక్కడివిరా ? తోట్లోవా ? ఇంట్లోవా ? ఓరి దొంగ గాడిదకొడకా। నా కెక్కడ దాపురించావురా, (మీదపడి ఒళ్ళు తెలియని రీతిగా తన్నుతాడు, వెంకన్న పెద్దగోల చేస్తూనే ఉంటాడు. అంత ఉపకారి ప్రవేశిస్తాడు.)
ఉప : (అడ్డుబోయి) ఆగండి। కుబేరయ్యగారు। పసిబిడ్డని అలా కొట్టుకుంటారెందుకండీ?

కుబే : ఏడ్చావ్-పోవోయ్ పంతులు! అసలు నిన్ని దార్ని రమ్మన్న వా డెవడు? రేపీదారిలో కంపలు పాతించేస్తా.

ఉప : ఔను, బ్రతుకుదెరువుల్లో కంపలు పాతేవాళ్ళనే వరిస్తుంది లక్ష్మి. లక్ష్మి నెత్తికెక్కిన వాడికి కళ్ళు కనిపించవు.

(వెంకన్న నెమ్మదిగా పోతాడు.)

కుబే : ఓరి నీ సిద్ధాంతం మండా! ఈ మాటలన్నీ నన్నే! నా యెనుకే!

ఉప : నిన్నుకాదు. పాలేరుతనాన్నీ కామందు తనాన్నీ సృష్టించిన సంఘాన్ని. ఒక వ్యక్తిని నేను ఎన్నడూ అనను. అసలు పద్ధతినే అంటున్నాను.

కుబే : ఓరి నీ చదువు తగలెయ్యా! దేవుడే లేడంటున్నావ్. కులాలే పనికిరావంటున్నావే! ఓరి నీ తలమీద రెక్కలబాంబు బ్రద్దలవ్వా! పో. ఇక్కడనుంచిపో. పోతావా, పోవా. (కొట్టడానికి సిద్ధపడ తాడు.)

ఉప : పోక యిక్కడ కూర్చుంటానా? తొందరపడవద్దు. మనిషిని కని పెట్టి మాట్లాడు. పరాయి బిడ్డని కొట్టటానికి నీ కధికారం లేదు. ఇష్టంలేకపోతే పని మానిపించెయ్యి. ఇప్పటికైనా సంఘమూ, మతమూ బోధిస్తున్న దుర్మార్గపు మూఢబోధనలనుంచి విముక్తి పొందు. ఇది నా సలహా.

(నిష్క్రమిస్తాడు, కుబేరయ్య నోరుతెరచి చకితుడై చూస్తాడు. తెర)

# ఐ ద వ ర ం గ ం

(తెల్లవారుజామున సీతమ్మ, వీరేశు పొలంలో గడ్డపిరుస్తూ వుంటారు. సీతమ్మ పొడుస్తూ, వీరేశు గడ్డతీస్తూ తట్టలోవేస్తూ వుంటారు.)

వీరేశు:- (పాట)

వస్తావంటోలి పిల్లా! నాతో,
కొత్తకోరంగి దాకా!

సీత : వస్తానుగానో, కుర్రా! నన్ను,
కొట్టకుండ వుంటావా?

వీరే : నల్ల నల్లనిదానా! పిల్లా!
నవ్వు మొగమ్ముదానా!
నవ్వులో పువ్వునౌతా-నే
పువ్వుల్లో తేనెవౌతా-వా?

సీత : నీతిగల జాతివాడా! మంచి
జబ్బగల కుర్రవాడా!
తియ్యన్ని తేనెనైతే- నన్ను
తిని పారిపోవు గంద?

('వస్తావంటోలె—కొట్టకుండ వుంటావా' అంతవరకూ మళ్ళీ పాడతారు.)

వీరే : సీత—నిజంగా నువు నాకూడా వచ్చేత్తే నీ మీద ఇలా (చెయ్యేసి) చెయ్యికూడా వెయ్యను.

సీత : (కంపరిల్లి, తప్పుకొని) ఇదిగో-నువ్వు మోటు సరసానికి దిగావంటే - మాట దక్కదబ్బాయ్.

వీరే : ఇల్లాలు కూతురువి!

సీత : మరేమనుకొన్నావు?

వీరే : అందుకనే నీమీద మోజు.

సీత : మోజుంటే ఏమి లాభం? దేవుడుకూడా నామీద చెయ్యి వెయ్యడానికి వీల్లేదు.

వీరే : మరి తీరా వేసేశాను చెయ్యి!

సీత : తప్పు దిద్దుకో.

వీరే : (మీద మళ్ళీ చెయ్యితీసేసి) మొదటితప్పు దిద్దుకున్నాను. రెండో తప్పుకూడా దిద్దుకోనా? (మళ్ళీ చెయ్యివేయబోతాడు)

సీత : ఇక నీ సరసని పనిచేస్తే— (కోపంతో వెళ్ళిపోబోతుంది.)

వీరే : (వారిస్తూ) వచ్చేసుకుంటా, నన్ను చంపుకు తిన్నట్టు. అందుకే నిప్పుకోసం నీదరి చేరాను.

సీత : చాల్లెద్దూ.

వీరే : పోనీలే. (బెల్లులతో నిండిన తట్టచూపుతూ) ఊఁ- ఎత్తు!

సీత: ఇంత మొగాడివి ఎత్తుకోలేవా?

వీరే : ఎత్తుకోగలను. కాని నువ్వుకూడా కలిస్తేనే సరదా.

సీత : కొరగకరాని కొయ్యవు. పట్టు. (ఎత్తుతుంది.)

వీరే : ఇంకా ఎత్తు—ఇంకా, ఇంకా,

(ఇద్దరికీ నవ్వు వస్తుంది. వీరేశు తట్ట జారవిడుస్తాడు. యిద్దరూ కిల కిలా నవ్వుతారు. అంతలో కుబేరయ్య ప్రవేశిస్తాడు.)

కుబే : ఏమిట్రా, ఆ కిలకిల్లు? ఓరి దున్నపోతా! ఆ పిల్లనేమి చేస్తున్నావురా? ఓరి యిబాసారి గాడిదకొడకా! ఇందుకా ఒంటరిగా నువ్వు దీన్ని తీసుకొస్తా? ఏమే సీతీ?

వీరే : (భయపడుతూ) ఆమె తప్పేమిలేదండిబాబు! నా తప్పుకూడా లేదుగానండి....

కుబే : ముయ్యరా నోరు, ఆడదానితో సరసమాడవచ్చునట్రా కుర్రతొత్తుకొడక!

వీరే : చిత్తం. చిత్తం.

కుబే : పోరా! నువ్వుపోయి బండి కట్టుకురా.

వీరే : చిత్తం. (వెళ్ళిపోతాడు అనుమానంగా)

కుబే ; సీతీ! నీకు మొగుడుకావాలంటే ?

సీత : ఏం మాట్లండి అవి ?

కుబే : అమ్మ నంగనాచీ !

సీత : నే వెళ్ళిపోతున్నానండి. (వెళ్ళబోతుంది)
కుబే : ఉండవే. ఈ చీకట్నే ఇంత పెందలకడే లేచివస్త నీ కోసమేగా?
(చెయ్యిపట్టుకుంటాడు)
సీత : (గింజుకుని) నే నంత లోకువగా కనుపిస్తున్నానా?
కుబే : అబ్బే మోజుగా కనిపిస్తున్నావు.
సీత : మీరు కామందులు, పెద్దలు, మీకిది తగదు నన్ను విడిచిపెట్టండి.
కుబే : తగడ మేమిటి? తగకపోవడమేమిటి? నీకూ నాకూ ఏమిటి?
నువ్వు పాలేరుదానవు; నేను కామందును. నేను చెప్పినది నువ్వు
చెయ్యాలి,
సీత : చేస్తున్నాగా!
కుబే : మరింక అడ్డమేమిటి? (మీదికివెళ్ళి చెయ్యి పట్టుకోబోతాడు)
సీత : (తప్పించుకొని) ఛీ, వొదలండి. ఈరోజు మొదలు మీ పనిలోకి
రాను.
కుబే : ఒక్కరోజు పనిలోకి రాకపోతే పదిరోజులు సత్తావు వరసగా!
సీత : చస్తేచస్తాను. ఎప్పటికైనా తప్పదుగా?
కుబే : కొంచెం వినవే, నీ కాళ్ళకు మొక్కుతాను!
సీత : మీ గౌరవం కాపాడుకోండి,
కుబే : (కోపంతో) అడిగేకొలదీ అలా ఆకాశంమీదికి పోతావేం?
చూడు — నీకు అడ్డ మెవడొస్తాడో. (మీదపడి పట్టుకుంటాడు.
తెరలో 'బాబోయ్ బాబోయ్' అని కేకలు వినిపిస్తాయి.)
కుబే : (సీతమ్మను విడిచి ఉగ్రుడై) ఛీ! ఎవడ్రా వెధవ? (తెరలో
అయ్యబాబోయ్, కామందుగారుండోయ్)
కుబే : ఓరి నిన్ను చిత్రవధచెయ్యా! ఏంపోయేకాలంరా నీకు?
పుల్ల : (ఏడుస్తూ ప్రవేశిస్తూ) అయ్యనాయనోయ్, బాబయ్యగారుండోయ్,
కుబే : ఓరి శనిగా! ఏడవరా, ఏంటో?
పుల్ల: (గుండె బాదుకుంటూ) చచ్చిపోతున్నాడండి బాబూ!
కుబే : ఎవడ్రా ఆ చవట! చచ్చేవాణ్ణి చావనివ్వక, ఇలా ఎందుకు తగ
లడ్డావురా ముసలిగాడిదా?

పుల్లి : మా యెంకడికండి బాబయ్యా !

కుబే : ఇంకా చచ్చాడా, లేదా ?

సీత : శివశివా ! (చెవులు మూసుకొని) యెంకన్నబాబుకా (నిష్క్రమిస్తుంది.)

పుల్లి : ఈపాటికి చచ్చిపోతాడేమోనండి బాబు ! మందేమన్నా........

కుబే : చచ్చేవాడికి మందేస్తేమాత్రం బ్రతుకుతాడంట్రా, చావనియ్యి. నీ శనే వదిలిపోద్ది.

పుల్లి : కన్నకడుపు కదండి, బాబయ్య !

కుబే : కడుపు ! ఎవడి కడుపు వాడిదే. ఎవడి కడుపుకు వాడే చూచుకుంటాడు. ఒకడి కడుపుకు ఒకడు పెడతాడ్రా ?

పుల్లి : వొచ్చే ప్రాణం, పోయే ప్రాణం బాబయ్యా!

కుబే : పోనివ్వోయ్, 'కొరగాని కొడుకు పుట్టిన తండ్రి గుణములు చెరచున్' అన్నారు గాంధీగారు. వంశాన్ని తగులబెట్టే కొడుకుంటేం, పోతేం ? (పది రూపాయలనోటు గిరవాటేస్తూ) పట్టుకుపో.

పుల్లి : మందిప్పించండి, బాబయ్యా !

కుబే: ఓరి నిన్ను తగలెయ్యా ! జిగురుకండెలాగ పట్టుకున్నావేమిరా - పానకంలో పుడకలాగొచ్చి ?.... సరే ... పోయి సీతిని పంపు-పో.

పుల్లి : చిత్తం ! చిత్తం. తమరు పెభువులు ... ఆ బళ్ళో పంతులండి ... ఏదో కేసెడతాడటండి, వొచ్చి చూశాడు కుర్రోణ్ని.

కుబే : (ఉలిక్కిపడి) ఆరి నీ దుంపతెగా! ఎందుకు రానిచ్చావురా వాణ్ణి? అయ్య గాడిదకొడకా ?.... అందుకేరా జబ్బు ఎక్కువై పోయింది. అందుకే అయ్యయ్యో ! ఆ పంతులుగాణ్ని ఇంటికి రానియ్యకురా! నీ కొడుకుని బ్రతకనియ్యడ్రా వాడు !

పుల్లి : తెలిసిందండి బాబయ్యా ! ఈ సారి ఒత్తే తన్ని తంపటేత్తానండి. ఆడికి సిగ్గులేదండి. రావొద్దంటే వత్తాడండి గాడిదకొడుకు !

కుబే : పంతుళ్ళంటే ఏమనుకున్నావురా ? వొట్టి దొంగలు, యిబా సార్లూను. బ్రతకలేనివాళ్ళంతా బడిపంతుళ్ళుగా తయారయ్యి, వూళ్ళన్నీ తగలడతార్రా. పుల్లా !

పుల్ల : చిత్తం బాబయ్యా ! చిత్తం.

కుబే : ఆ పంతులుగాడి మాట వినేవుసుమా ? చెడిపోతావు. ఇక పో. మందుకి సీతిని పంపు.

పుల్ల : చిత్తం చిత్తం (నిష్క్రమిస్తాడు)

కుబే : ఎంతప్రమాద మొచ్చింది ! అన్నన్నా ! వెంకడు నేను కొట్టిన దెబ్బలవల్ల చచ్చిపోయాడని కేసెడతాడా ఆ పంతులు !..... వా డంతటివాడే. డాగుటేరు సక్కిపిక్కంటు అక్కర్లేదూ ? అదీ చేస్తాడు! ముందే నేను డాగుటేరుతో మాట్లాడితేనో?-అదేరైటు, జ్వరంవల్ల చచ్చినోడంటే తీరిపోద్ది.... ఫర్వాలేదు. నా మీదకేమీ రాకుండా నేను చూసుకోగలను. పుల్లడు నాచేతిలో మనిషే. కాని.... ముందుంది పంతులు పని. వాడొక తెగ నీలుగుతున్నా డులే. వీడొచ్చినప్పటినుంచీ పాలేళ్ళకి కరువైపోయింది. (పచార్లు చేస్తూ) సరే, కానీ.... .........



## ఆ ర వ ర ం గ ము

[పుల్లయ్య ఇల్లు : వెంకన్న మూల్గుతూ ఒక కుక్కిమంచలో కూలబడివుంటాడు. సీతమ్మ మందుపట్టుకొని నిలబడివుంటుంది]

సీత : త్రాగుబాబు ! ఇదిగో మందు త్రాగవూ ?

వెం : వద్దు పిన్నీ ! నేను త్రాగను, 'నా' అనేవాళ్ళు లేని నా బ్రతుకు ఎంత నిరర్థకం !

సీత : 'నా' అనేవాళ్ళెందుకు లేరు నీకు ? కొండంత బాబుండగా ?

వెం : బాబు ! బాబు ... దేశాన్ని అవిద్యలోనూ, అజ్ఞానాంధకారం లోనూ, దాస్యంలోనూ ముంచేస్తున్న ఇలాంటి వాళ్ళంతా బాబులే!

సీత : పోనీ నే నున్నానుగా ?

వెం : నీవా ? నీవు స్వతంత్రురాలవా ? స్వతంత్రంలేని వ్యక్తి తాను బ్రతకడమే బరువు. ఇంకొకర్ని ఎలా బ్రతికించగలదు ? ఇంత వరకూ నీవే నన్ను బ్రతికించావు, ఇక బ్రతికించలేవు.

సీత : నాకదేమీ తెలవదు. ముందు మందుత్రాగు బాబూ !

వెం : నేను త్రాగను, నన్ను బలవంతంచెయ్యకు.

పుల్ల, (ప్రవేశించి) ఓరి త్రాగరా, వెంకి గాడిదకొడకా ! యమిలోడివి దాపరించావేరా మాకు ?

వెం : నాకు మందక్కరలేదు. నేను త్రాగను. నేను చచ్చిపోతాను.

పుల్ల : ఎవణ్ణుద్దరింతావురా చచ్చీ ?

వెం : బానిసతనం కంటే చావు మేలు. నాలాంటి కుర్రవాళ్ళంతా హాయిగా చదుకొని పైకి వస్తూవుంటే - నేను పాలేరునై పశువు లాగ బ్రతకలేను. నేను సుఖంగా చచ్చిపోతాను.

పుల్ల : కాదు. తాగరా !

వెం : నేను బ్రతికితే బడికి పంపిస్తావా ?

పుల్ల ; చతువు మన అయాం కాదురా. ఐనా గడవనివాళ్ళం, ఒక పూట తింటే రెండోపూటకి లేనోళ్ళం. కడజాతివాళ్ళం. కూలోళ్ళంఎలా గరా చదవడం?

వెం: మనకంటె దరిద్రులు, మనకంటె నీచజాతివాళ్ళు ఎందరు చదువు కొని పైకొస్తున్నారో చూస్తున్నావుగా? ఉద్దేశాలు వుంటే ప్రయత్నాలు ఫలించి తీరుతాయి. కొడుకు ఉద్దేశాన్ని అనుసరించి అభివృద్ధి పర్చటం తండ్రి ధర్మంకాదా? తనకంటే తన కొడుకు ఒక అడుగు ముందుకు పోవడంకాదా తండ్రి కోరవలసింది?.... నన్ను బడికి పంపిస్తానంటే మందు త్రాగుతాను.

పుల్లి: (కోపంతో) చచ్చినాసరే నిన్ను బడికి పంపించను. (వెళ్ళిపోతాడు)

సీత: పిచ్చి పట్టువద్దు. త్రాగునాయనా! (మందు అందిస్తుంది)

వెం: (తోసేస్తూ) వద్దుపిన్నీ! వద్దు! మాయమ్మ పోయిననాటినుంచి నీవు నన్ను పెంచావు. నీకు నేను కృతఘ్నుణ్ని. నీ ఋణం యిక నేను తీర్చుకోలేను. పంతులుగారు ఒక్కసారివస్తే బాగుండును. (ఆలోచనలో పడతాడు)

సీత: (కళ్ళు తుడుచుకుంటూ) పోనీ, ఆ పంతులుగారినైనా పిలిచేదేమో! తీసుకొస్తాను. (వెళుతుంది)

వెం: ఇంతటితో నాజీవితం సరి. నిన్న పరీక్షలో పడి చావడం బాలగురించి తప్పించింది. ఈవేళ ఇక తప్పదు. బాధలు పడుతూ, అవమానాలు భరిస్తూ, ఏహ్యజీవితం గడిపేకంటే, హాయిగా ఆత్మహత్య చేసుకుని, కళ్ళు మూసేస్తే యెంత సుఖం! నా తల్లి బ్రతికివుంటే నాకిన్ని కష్టాలు రాకపోవునేమో! (కళ్ళు తుడుచుకుంటూ) ఏమో! అందరి తల్లిలాంటిది కాదా నా తల్లిమాత్రం మా బాబు నాలుగు తన్ని కూర్చోబెటితే ఏంచేస్తుంది .. అయ్యో! ఇక యీ ప్రపంచంలో నేను కనబడను. ఆ దూడలూ, ఆ చేలూ, ఆ ఆటలూ, ఆ గొబ్బిపూలు, ఆ బాల... (వెక్కి వెక్కి ఏడుస్తాడు)

ఉప: (ప్రవేశించి) వెంకన్నా! (మీదచేయివేసి చూచి) స్వాతంత్ర పోరాటం ఎంత కష్టమో తెలుస్తున్నదా? (మందుపోసి) దేశంలో నీలాంటి పట్టుదల గల కుర్రాళ్ళు ఒక్క పదిమంది వుంటే, ఎంత అభ్యుదయం చేకూరగలదు! ఇదిగో మందు త్రాగు.

వెం : క్షమించండి పంతులుగారు! నేను మందు త్రాగదలుచుకోలేదు. నన్ను సుఖంగా చచ్చిపోనివ్వండి.

ఉప : చావా? చచ్చిపోవడం ఒక ప్రయోజకత్వం అనుకొంటున్నావా? ఆత్మహత్య పిరికితనం, పౌరుషహీనం.

బ్రతికి యుండియెపునిషి శుభమ్ము లొందవలయు, చచ్చిన తరువాత బ్రతుకులేదు;
బ్రతికి సాధింపవలెగాని వాంఛితములు,
చచ్చి సాధింతు ననుమాట చచ్చుమాట.

వెం: నేను చచ్చిపోయి ఈ కాపందులకు కామందునై పుడతాను. ఈ కామందు, మా బాబు నాకు పాలేళ్ళయి పుడతారు. అప్పుడు నా పగ సాధించుకొంటాను.

ఉప : నీవు అబద్ధాలెందుకు నమ్ముతావు? పూర్వకర్మ-పునర్జన్మ సిద్ధాంతాలు తప్పు. పాటకపుజనాన్ని మోసగించటానికి పుట్టిన సిద్ధాంతాలవి. అసలు దేవుడున్నాడనేదే మూఢ విశ్వాసం. ఈ లోకంలో పుట్టిన ప్రతి జీవీ స్వాతిశయం స్థాపించుకుని స్వయంపోషకమై బ్రతకాలి. స్వాతిశయం స్వయంపోషకశక్తి బ్రతుక్కి మూలాధారాలు, అవిలేని జీవి బానిసతనంలో పడుతుంది. నీ ఆశయాలు ఫలించటానికి ముందు నీవు బ్రతకాలి.

వెం : బ్రతకడం చాతకాకనేగదా చచ్చిపోవడం!

ఉప: ముందు మందు త్రాగు.

వెం : త్రాగుతాను చెప్పండి.

ఉప : నిన్ను నేను చదివిస్తాను-సరా?

వెం ; పరసహాయం నేను పొందను, అది నన్ను ఋణగ్రస్తుణ్ణి చేస్తుంది.

ఉప . ఈ వెట్టివేదాంతం యెక్కడిదోయ్ నీకు? మీ కామందుచెప్పాడా? మీ బాబు చెప్పాడా?.... పోనీ, ఇదివరలో నీ ఋణగ్రస్తులే ఇప్పుడు నీకు సహాయం చేస్తున్నారేమో?

వెం : అదీ కావచ్చు.

ఉప : పిచ్చి కుదిరింది. తలకు రోకలి చుట్టమనక - మందు త్రాగు. సహాయం వచ్చినచోటల్లా పొంది, చదువుకో. అదృష్టం వుంటే పైకొస్తావు. అప్పుడు పునస్సహాయం చేస్తావు.

వెం : సహాయం—పునస్సహాయం.

ఉప : (నాడిచూచి) జ్వరం తీవ్రంగా వుందే! పలవరిస్తున్నాడు! డాక్టర్ని పిలవాలి. (త్వరితంగా .... నిష్క్రమిస్తాడు)

వెం : సహాయం —పునస్సహాయం.

[అంత బాల ప్రవేశించి, శరీరం తాకిచూచి, తడిపిన మల్లెపూల దండ అతని నొసలిపై పెడుతుంది. కొంచెం సేపటికి వెంకన్న ఉలిక్కిపడి లేస్తాడు - "పంతులుగారూ!" అంటూ....]

బాల : వెంకన్నా !

వెం : బాలా ! (ఏడుస్తాడు)

బాల : ఏం వెంకన్నా ? ఏడుస్తావెందుకు ? ఇదిగో మందు త్రాగు !

వెం : బాలా ! క్షమించవు ?

బాల : ఎందుకు ? ఏం తప్పుచేశావని ?

వెం : నేను పుట్టడమే ఒక తప్పు. బ్రతకడం రెండో తప్పు.

బాల : అస్వతంత్రులు అందరికీ అంతే.

వెం : నీవు ఇచ్చిన అరటిపళ్ళు వెంటనే తినేస్తే, ఈ దెబ్బల్లో సగం దెబ్బలు తప్పును. పట్టుదలే చూచుకున్నాను గాని ప్రేమ చూచుకో లేదు.

బాల : ముందు మందు త్రాగు. (పోసి ఇస్తుంది)

వెం : త్రాగను. నీవు క్షమించానంటే ఆ మాటలు వింటూ ప్రాణం వొదిలేస్తాను.

బాల : నే క్షమించను.

వెం : అయ్యో ! క్షమించవు ? క్షమించవు ? బాలా ! బాలా ! అయ్యో! క్షమించవు ?

బాల : చదివిస్తానంటే మందు త్రాగుతానన్నావటగా మీ బాబుతో ?

వెం : అదంతా ఇప్పుడెందుకు ?

బాల, ఆపని అతడేమి చేయగలడు? నేను చేస్తాను. మందు త్రాగు.
వెం; నీవు చిన్నపిల్లవు.
బాల; నీవు మహా పెద్దవాడివా?
వెం; నీవల్ల ఒక్క ఉపకారం కోరుతున్నాను.
బాల; ఉపకారం చెయ్యడానికే నేనూ వచ్చాను. మా అన్నయ్య కాకి నాడలో చదువుతున్నాడు. ఎరుగుదువా?
వెం; అదికాదు.
బాల; మరేమిటి?
వెం; నీవిప్పుడు నన్ను చూడ్డానికి వస్తావనుకోలేదు.
బాల; నీ వైతే రాకపోదువు.
వెం; నిజమే! ఉద్దేశం లేకపోలేదు. సాహసం లేక. నీవు శ్రీమంతు రాలవు. సాహసంచేసి, స్వతంత్రంగా మెలగగలవు. నేను పాపేర్ని. స్వతంత్రం లేదు. సాహసం చెయ్యలేను. చేసి నిర్వ హించుకో లేను. అందుకే నీ కోరిక సఫలమౌతుంది. నీజీవితం వికసిస్తుంది. నాకోరిక నాలోనే తుప్పుపట్టి నశించి పోతుంది.
బాల; కోరిక వుండడమే ముఖ్యం. ఈనాడు కాకపోతే రేపైనా సఫల మౌతుంది. నీకొనర్సవలసిన వుపకారం ఏమిటి?
వెం; మొన్న నువ్వు పాడినపాట - ఒక్కసారి పాడు. ఆ లయ బ్రహ్మలో ప్రశాంతముగా లయమైపోతాను.
బాల; మరి పాడినందుకు నాకు బహుమతి?
వెం; ఈ గర్భదరిద్రుడు యీయగలిగిం దేదైనా సరే?
బాల; ముందే యియ్యాలి.
వెం; సరే.
బాల; ఈ మందు త్రాగు.
వెం; చచ్చిపోవద్దా?
బాల: నీవు బ్రతకాలి.
వెం: బానిసగానా?
బాల: స్వతంత్రుడివిగా.
వెం: ఎలాగా?

బాల : నేను చెపుతాను.
వెం : ఏమో నాకర్థంకావటంలేదు.
బాల : ఇదుగో మందు.
వెం : (అందుకుని) ఈ ప్రాణం నీ భిక్ష (త్రాగుతాడు)

బా ల : (పా ట)

ప్రేమ మనరా - ప్రేమ గనరా :
ప్రేమ జీవిత - మౌరా ;
ప్రేమము నిచ్చి - గైకొనువాడే
పృధ్విని ధన్యుడురా ;
మనుజుల అభివృద్ధికి—తోడ్పడ నీ
మనుగడ యేలనురా ?
బ్రతికియుండియును, ఏలా చచ్చిన
గతి బడి యుందువురా ?
నిరాశ యేలా ? యువకుడ ; నీకు
జరామరణములు లేవురా ;
రాత్రి గడిచి వచ్చేడి రవిగతి
మార్గము జూపగలేవా ;

[పాడుతుండగా తెర జారును.]

—o—

## ఏడవ రంగము

(సాయం సమయం, పొలంలో వీరేశు. సీతమ్మ యింకో యిద్దరు కూలీలు బెల్లుపని చేస్తూ పాడుతూ వుంటారు.)

వీరే : (పాట) ఎండలో వానలో కూలోడా !
అందరు బండచాకిరిచేసి కూలోడా !
వీరే : .... .... ....
అంద: .... .... ....
వీరే : పండించి పెదతావు కూలోడా !
తిండి నీ కేదిరా కూలోడా !
అంద: పండించి .... ....
వీరే : నీశక్తి నీ బ్రతుకు కూలోడా !
అంద: నేల కర్పిస్తావు కూలోడా !
వీరే : .... .... ....
అంద : .... .... ....
వీరే: పోరాడగలిగితే కూలోడా !
ఈ రాజ్యమే నీది కూలోడా !
అంద : .... .... ....

మొదటి కూలి: రాయే సీతమ్మా ! పట్టు (తట్ట చూపుతూ)
వీరే : అంత బరువుతట్ట దానిచేత పట్టించకురా !
రెండవకూలి : ఏంట్రో వీరే శంటాడు ?
మొ. కూ : అంతా వుందిలేరా !
వీరే : ఏం వుంది రా, నీ తలకాయ ?
సీత : కాదు మొట్టికాయ (దగ్గరవున్న కూలీని మొట్టుతుం)
మొ. కూ: అమ్మ సీతమ్మతల్లో ! (తలగోక్కుంటాడు.)
రెం. కూ: నీ కెందుకమ్మా అంత వులుకు ?
వీరే : నీ బులుపు కూడా వదలాలేంట్రా ?
సీత : వీళ్ళతో నేను పనిచెయ్యలేను బాబు (వెళ్ళబోతుంది)

వీరే : (చేతితో ఆపి) పీళ్ళిద్దర్ని మెళ్ళిరగ తొక్కేత్తా.
మొ. కూ: ఇంకేం అనములేరా బాబూ !
రెం. కూ: మీ కిద్దరికీ పెళ్ళని తెలిసిందిరా !
వీరే : ముందు మీ కిద్దరికీ అవుద్ది.
మొ. కూ : కామందుగారు ఇంకా రాలేదు నయమే.
రెం. కూ : వత్తే మనందరికీ అవుతాయి పెళ్ళిళ్ళు.
వీరే : (చూచి) కామందుగారు ! కామందుగారు !
అంద : (ఉలిక్కిపడి) దండాలుండి బాబుగారు !
వీరే : (విరగబడి నవ్వుతాడు. అంత మెల్లిగా ప్రవేశం, ఊతకర్రతో వెంకన్న.)
అంద : (చూచి) ఓరి యెంకడ్రా !
వీరే : కుంటి కామందుగారు !
సీత : ఇలా వచ్చావేం పడుకోక !
వెం : బాబు వెళ్ళమని చంపుకుతింటేనే !
వీరే : పాలేరుతనం చెయ్యరు దొరగారు ! గట్టుమీద కూర్చోండి.
సీత ; ఎందు కా వేళాకోళం ?
వీరే : అబ్బే ! డబ్బులేని దొరగారనీ.
మొ. కూ : కూర్చోరా వెంకన్న ! నిలబడలేవు.
వీరే : గొడుగేసుకో !
రెం. కూ : వాణ్ణి అలా ఆక్షేపించకురా ! పాలేరుతనం వద్దంటే - నిజమే; రోజూ మనం తిట్లూ, దెబ్బలూ తప్పితే ఏం బావుకుంటున్నాం పాలేరుతనంలో ?
వీరే : చదువులో కెళితేమాత్రం తిట్లూ, తన్నులూ ఇంకా గోడకుర్చీలు, కోదండాలు తప్పుతాయా ?
మొ. కూ : గోడకుర్చీలు వేసినవారే కుర్చీలమీద కూర్చోడం, కోదండాలు వేసినవారే దండాలు పెట్టించుకోడం.
రెం. కూ: వెళ్ళి పడుకోరా నిలబడలేవు.
మొ. కూ ; మనిషి పనికిరాకుండా కొట్టిపారేశార్రా. ఇంతలో కోలుకుంటాడని అనుకోలేదు.

వీరే : ఏదిశారు పోంద్రా ! రారా వెంకన్నా బెల్లుపొదవరా ! పదు చోడ్కి నీర్సమేంట్రా ? ఇదిగో గునపం !

(పుల్లయ్య ప్రవేశం.)

పుల్ల : పట్రా తట్ట ! అలా నిలబడతావే మొద్దులాగ ?

వెం : (బోరుస ఏసుస్తాడు)

సీత : చాల్లే, చాలని ! రా బాబూ పడుకోందుగాని. (వెంకన్నను తీసుకు పోతుంది.)

పుల్ల : ఈ కుర్రముండే వీణ్ని చెరిపేస్తుంది. (వెనుక దురుసుగా పోతాడు.)

మొ. కూ ; వాళ్ళని చావదన్నేలాగున్నాద్రా !

వీరే : వాళ్ళ వొంటిమీద ఒక్క దెబ్బపడితే పుల్లడి నడుం పెళ్ళునవిరిగి పోద్ది. (దురుసుగా వెళతాడు. వెనక కూలీలిద్దరూ వెళతారు. అంత వెనుకనుంచి ఉపకారి ప్రవేశిస్తాడు)

ఉప ; (ముందుకు పరికించి చూచి) ఓహో ! వీళ్ళు వెంకన్నను బ్రతకనిచ్చేలాగ లేరు. ఇక అతణ్ని ఈ ఊళ్ళో వుంచితే లాభంలేదు. కాకినాడ అనాధశరణాలయం సూపరింటెండెంటు నాకు స్నేహం కదా ! ఈ రాత్రే ప్రయాణంచేసి పంపించెయ్యాలి. అధోగతినుంచి ఒక జీవి ఉద్ధరింపబడినా ఉద్ధరణమే. ఓహో యెంతలో చీకటి పడింది !

గీ॥ అంధకారమునుండి యీ యవని నొకని
ఉద్ధరించుటకొరకు, సూర్యుండు శానె
అంధకారములో మున్గి యరిగె నొర !
సదయు లగువారి త్యాగమే గద చరిత్ర !

(నిష్క్రమిస్తాడు. కొంతసేపటికి తెరతేస్తుంది. అది పుల్లయ్య యింటి ప్రాంతం, బాగా అలంకరించుకొన్న కుబేరయ్య యిటూ అటూ పచారు చేస్తుంటాడు)

కుబే : ప్రొద్దుకూకి యెంతోసేపు కాలేదు: అప్పుడే యెంత చీకటిపడ్డది. ఇది నా కార్యసాధనకి శుభసూచన। సీతిని యెలాగైనా వల్లో వేసుకోవా లీవేళ. అమ్మ! ఆడదాని లోతు కనిపెట్టలేము. కామందుని నన్ను నిరాకరించింది. ఆ వీరిగాడికి చనువిచ్చింది. దీనిపని యీవేళ చెపుతాను. ఆ॥ (ఆలకించి) ఎవరా పాట! (పరికించి చూస్తాడు)

(తెరలో పాట)

హృదయము కానగలవా మూఢా।
ఏమాత్రము నీ ధనము?
స్వేచ్ఛాజవిని బంధించెదవా?
శృంఖల బల మేపాటి?
నీ సదయత్వము, నీ సౌహార్ద్రము,
నీ ప్రేమామృత మాధురిమా,
లెక్కకు వచ్చే శక్తులు,
తక్కినదంతా చెత్తా.

కుబే : అమ్మ! వెంకడే। అదిగో। అలా పోతున్నాడు। అరే! ఇలాగే వస్తున్నాడే, (ఒదుగుతూ) కాదు, అలా తిరిగాడు....... యెక్కడికో ప్రయాణమై పోతున్నాడే। ఏ కొంపైనా దొయ్యటానికి కాదుగద? అలాంటివాడు కాదుగాని—యేమో—వినాశకాలానికి విపరీత బుద్ధులు....... యెక్కడికో చస్తాడు. చావనీ నాకూ మంచిదే.........ఇక ముందు పుల్లిణ్ణిలేపి పొలం పంపేస్తాను. ఆ॥ నా కుడికన్ను అదరడంలేదే। (కదిపి చూసుకుంటాడు.) పుల్లిగా. పుల్లిగా। (కేకేస్తాడు.)

[తెరలో]

"ఎవడెసే వాడు, నిద్ర సెడగొడతాడు?"

కుబే : కళ్ళుతెరచి మాట్లాడ్రా. గాడిదకొడకా ।

పుల్లి : (ప్రవేశిస్తూ) ఎవడ్రాడు! (కళ్ళునులుముకుని చూచి) దండాలు బాబయ్యా। గులాపోణ్ణి బాబయ్యా। నిద్రమత్తు బాబయ్యా।

కుబే : ఓరి దున్నపోతా ! నీపని ఇలాకాదు. నువ్వుపోయి, కొబ్బరి రాశి దగ్గర పడుకో. ఏదో అల్లరిగావుంది వూరు.

పుల్లి : చిత్తం, చిత్తం. కానీ—కాలూ, చెయ్యీ లాగుతున్నాయండి బాబయ్యా! ఆముదం రాసుకుని కుంపటెట్టుకుని కాచుకుంటున్నానండి.

కుబే : ఎండాకాలంలో కుంపటేంట్రా. వెళ్ళు. కావలిస్తే కుంపటికూడా పట్టుకెళ్ళు.

పుల్లి : చిత్తం. సీతీ! ఆ కుంపటీ, చుట్టా, కర్రా ఇలా ఇయ్యి.

సీత : (అవన్నీ ఇస్తుంది.)

పుల్లి : తలుపేసుకో (నడచి) తలుపేసుకో! (నిష్క్రమిస్తాడు)

కుబే : సీతీ ! కాస్త అగ్గిపెట్టె అందుకో.

సీత : కుంపటి తీసుకుపోయాడుకదండి మాబావ. ఈ దీపాన్న కాల్చుకోండి. (దీపం తెస్తుంది.)

కుబే : భలే ! దీపం ఇంకా వెలుగుతోందేం ? ఎక్కడ సంపాదించావే కిర్సనాలు !

సీత : మా వెంకన్నబాబు కనబడలేదని ఇప్పుడే వెలిగించానండి. మీ వంటోరికిగాని, మా కెలాదొరుకుద్దండీ కిరసనాయి ?

కుబే : ఆఁ! మీయింట్లో ఎంత కిరసనాలు చూపను ?

సీత : చూపండి ఒక్కచుక్కయినా ?

కుబే : రా. చూపుతాను. (చెయ్యిపట్టుకొని లాక్కెళ్ళబోతాడు)

సీత : (గింజేసి) మీరు చెయ్యేస్తే మాటదక్కదండి. గొప్పయింటివార్కి నీచపుబుద్ధులు కూడవు.

కుబే : గొప్పింటోరైతే పిల్లల్ని కనుక్కోరా యేంటే! అయ్యో, వెర్రి మొగమా !

సీత : ఇక పోదురూ.

కుబే : పోవడానికేనా యేమిటివస్తి! ఎన్నాళ్ళనుంచో అనుకుంటున్నాను— నీకు చీరా, రైకా ఇవ్వాలని. రేపు మా షాపులోకిరా. నీకునచ్చిన బట్టలు తీసుకుందువుగాని.

సీత : నాకున్నవి చాల్లెండి.
కుబే : పోనీ-ఇదిగో ఈ పదిరూపాయలు తీసుకో.
సీత : నేను బోగందాన్ని కాను. ఈపాటికి దయసెయ్యండి.
కుబే : బలవంతం చెయ్యించుకుంటావ్ ।
సీత : మీతరంకాదు .. మీరు కామందులు, నామర్యాద కాపాడండి.
కుబే : దిబ్బ మర్యాద. ఆ యీరిగాడితో....
సీత : ఊఁ! ఈరిగాడితో ? ఏఁటి ? సరసమా ? సరసానికేమొచ్చింది ? మీరూ ఆడారుగా ఇప్పటిదాకా ?
కుబే : నేను కామందుని, కామందంటే సగంమొగుడు.
సీత : ఒడబడ్డాళ్ళకి పూర్తిగా మొగుడే.
కుబే : నా కమతంలో అడుగుపెట్టనివ్వను.
సీత : అడుక్కుతింటాం.
కుబే : చూచుకోమరి, (దగ్గరికి వెళతాడు)
సీత : ఒక్క అడుగు కదపలేరు.
కుబే : ఆఁ! (నవుం బిగించి) కోడి రామ్మూర్తినికూడా అమాంతంగా ఆమడదూరం గిరవాటెయ్యగలను. ఎంతమందిపాలేళ్ళ పెళ్ళాల్ని లొంగదీసుకున్నానో నా మజా నీకేమి తెలుసు ? నీ యప్ప నా చేతిలోనే చచ్చిపోయిందితెలుసా ? (మీసందువ్వి) చూచుకోమరి.
(మీద పడతాడు. సీతమ్మ గింజేస్తుంది. కుబేర్రావు వెల్లకిల క్రింద పడతాడు. అంతలో వీరేశు ప్రవేశించి కర్రెత్తుతాడు. కుబేర్రావు భయకంపితుడై పారిపోతాడు.)
వీరే : (రోషంతో) గాడిదకొడుకు । వీడా కామందు ? తనను ఆశ్రయించుకుని బ్రతికేవాళ్ళ అభిమానాన్ని పాడుచేసే కుక్క । ఇందుకే ఈదేశం యిలా ఏడుస్తోంది. ఛీ! పాలేరుగా బ్రతికేకంటే, చర్తేనయం. మా యెంకడు యిందుకే పాలేరుగా బతకనంటాడు. వాడే రైటైన మనిషి.
సీత : ఇప్పుడెలాగొచ్చావూ ?
వీరే : నేనా ?, నీ వరసంతా చూత్తూనేవున్నాను.
సీత : ఆఁ! నా, వరస ?

వీరే : కాదులే నీ కామందు వరస ?
సీత : ఇక ఈ ఊళ్ళో ఉండలేను.
వీరే : ఎక్కడికైనా లేచిపోదాము.
సీత : నువ్వుకూడా ఎందుకు ?
వీరే : నీకు జత. ఆడమనిషితోకూడా మగోడు ఎందుకొత్తాడూ ?
సీత : తన్నులు తినడానికి !
వీరే : అహ్హహ్హ! (నవ్వి) నేను కుబేరయ్యను కాను.
సీత : అలానే వుంది నీవరస.
వీరే : నే నంత నీచుణ్ణి కాను.
సీత : ఆ!!
వీరే : ఇన్నాళ్లూ నాకు చనువెందుకిచ్చావు ?
సీత : తప్పా ?
వీరే : తప్పే. మగోడికి ఆడది చనువిత్తే.........
సీత : నువ్వుకూడానా ?
వీరే : ఆ! సొబావం అంతటా ఒక్కటే. కాని నాకంతటితో తృప్తిలేదు.
సీత : ఇంకా ?
వీరే : ఇంకా ఏమిటి ? నీవు మొత్తానికే కావాలి. నిన్ను పెళ్ళాడతాను.
సీత : చాలించు. ఇక నను, బెడ్డపన్లోకి.
వీరే : ఒకమాట విను. మనమిద్దరమూ పేదలమే. పనిచేసుకొని బతకగలం. పట్టమెల్లిపోయామంటే రెండురూపాయల్తో మనం పెళ్లాడొచ్చు. చిలకా గోరంకల్లాగ బతకొచ్చు. ఆలోచించు. ఈ కామందు ఇక మనల్ని బతకనియ్యడు. ఎలాగో ఒకలాగ పగ సాధిత్తాడు. ఈ రాత్రే పోతే మంచిది.
సీత : నిజంగానేనా ? నన్ను అన్యాయం చెయ్యవుగదండ ?
వీరే : (చేతిలో చేయివేసి) పచ్చని చెట్టుకింద నిలబడ్డాం. ఈ చెట్టు సాక్ష్యం. ఆ చుక్కలు సాక్ష్యం. నిన్ను లక్ష్మిలాగ చూచుకుంటాను రా! పోదాం. తెల్లారేటప్పటికి యీ చుట్టుపక్కల కనిపించగూడదు.
సీత : (అతనిచేతుల్లోకి పోతుంది.)

